**BOOK OF NAMAAZ**
**(TELUGU)**

# నమాజ్ పుస్తకం




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్
సందేశ భవనం, ఛత్తాబజారు
హైదరాబాద్ - 500 002.

# ముందుమాట



నమాజ్ విశ్వాసి జీవితంలో ప్రత్యేకంగా కానవచ్చే మొట్టమొదటి అంశం. నమాజ్ విశ్వాసి జీవితంతో విడదీయరాని చిట్టచివరి బంధం కూడా. నమాజ్ జీవుడి సంబంధాన్ని దేవుడితో పటిష్ఠపరిచే రాచమార్గం. నమాజ్ చీకటి అలుముకున్న బ్రతుకులో వెలుగును నింపుతుంది. సంఘర్షణామయ జీవన ఘడియల్లో ప్రశాంతతను వెదజల్లుతుంది. నిరాశాజనక వాతావరణంలో సతుష్టిని విలసిల్లజేస్తుంది. ఒక్కమాటలో నమాజ్ విశ్వాసి జీవితానికి ఊపిరి!

నమాజ్‌ను నేర్పే పుస్తకాలు తెలుగు భాషలో అనేకం ఉన్నాయి. కాని నమాజ్‌తో ముడివడిఉన్న అనేక అంశాలను సయితం విశదపరిచే అనేక విషయాలు, ముస్లిముల జీవితంలో అనుదినం అనుసరణీయమయిన అంశాలు - అన్నీ ఒకే చోట చేర్చి కూర్చిన పుస్తకం లేదని, అలాంటిది ఒకటి సంకలనం చెయ్యాలని వచ్చిన సూచనల మేరకే ఈ పుస్తకం తయారు చేశాము.

ఈ చిరు పుస్తకం రూపకల్పనలో అనేక జాగ్రత్తలు తీసుకోవడం జరిగింది. అయినా ఏదయినా పొరపాటు దొర్లి ఉంటే దానికి అల్లాహ్‌ను క్షమాపణకై వేడుకుంటున్నాము. పాఠకులు ఇందులోని తప్పుల్ని సూచించినట్లయితే మలి ముద్రణలో దాన్ని తీర్చి దిద్దగలము.

ప్రకాశకులు

**NAMAAZ PUSTAKAM**

**Book of NAMAAZ (Telugu)**

**Telugu Islamic Publications**

**Series No. 70**





Second Edition : February, 1994

Price : Rs.8=00

Copies : 5000

Published by : Telugu Islamic Publications
'Sandesha Bhavanam'
Lakkadkot, Chatta Bazar,
Hyderabad - 500 002. India.
Phone: 521237,
Grams : 'Geeturai-500 002'

Typeset by : Geeturai Graphics
Lakkadkot, Hyderabad - 2

Printed by : Kala Jyothi Process (P) Ltd.
R.T.C. X Roads, Hyderabad.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అపార కృపాశీలుడు అనంత కరుణామయుడు అయిన అల్లాహ్ పేరుతో

# 1

# ఈమాన్ మరియు ఇస్లామ్

కొన్ని విషయాలను విశ్వసించడం, అల్లాహ్ ఆజ్ఞల్ని పాలించడం ముస్లిమయిన ప్రతి వ్యక్తి తప్పనిసరి విధి. ఈ విశ్వాసాలు, ఈ ఆజ్ఞాపాలననే ఈమాన్ అని, ఇస్లామ్ అని అంటారు.

**ఇస్లామ్‌కు సంబంధించిన అయిదు ముఖ్యాంశాలు :**

1. అల్లాహ్ తప్ప మరెవరూ ఆరాధ్యులు (ఆరాధనలకు అర్హులు) కారని, ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) అల్లాహ్ దాసుడు, ఆయన ప్రవక్త అని విశ్వసించడం.
2. రేయింబవళ్ళల్లో అయిదు పూటల నమాజ్ చెయ్యడం.
3. రమజాన్ నెలలో రోజా వ్రతాన్ని పాటించడం.
4. జకాత్‌ని చెల్లించడం.
5. శక్తి స్తోమతలు ఉన్నవారు హజ్‌కై కాబా (మక్కా) యాత్ర చెయ్యడం.

అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహు లాషరీక లహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహు.

అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడూ లేడని, ఆయన ఒక్కడే అని, ఆయనకు ఎవరూ సహవర్తనుడు కాడని నేను సాక్ష్యమిస్తున్నాను. ఇంకా ముహమ్మద్ (సఅసం) ఆయన దాసుడు, ఆయన సందేశహరుడు అని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను.

**మూడవ కలిమా**

سُبْحَانَ اللّٰهِ وَالْحَمْدُ لِلّٰهِ وَلَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاللّٰهُ اَكْبَرُ،
وَلَا حَوْلَ وَلَا قُوَّةَ اِلَّا بِاللّٰهِ الْعَلِيِّ الْعَظِيْمِ

సుబ్హానల్లాహి వల్ హమ్దులిల్లాహి వలా ఇలాహ ఇల్లల్లాహు వల్లాహు అక్బర్. వలా హౌల వలా కువ్వత ఇల్లా బిల్లాహిల్ అలియ్యిల్ అజీమ్.

అల్లాహ్ పరిశుద్ధుడు, సకల స్తోత్రాలు అల్లాహ్ కొరకే. అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడు. ఆయన గొప్పవాడు. అల్లాహ్ ద్వారా లభించేది తప్ప మరే అధికారంగాని మరే శక్తిగాని ఏదీ లేదు. ఆయన మహోన్నతుడు, మహోజ్వలుడు.

**నాల్గవ కలిమా**

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَاشَرِيْكَ لَهٗ لَهُ الْمُلْكُ وَلَهُ
الْحَمْدُ يُحْيِيْ وَيُمِيْتُ بِيَدِهِ الْخَيْرُ وَهُوَ عَلٰى كُلِّ شَيْئٍ قَدِيْرٌ

లా ఇలాహ ఇల్లల్లాహు వహ్దహు లా షరీకలహు లహుల్ ముల్క వ లహుల్ హమ్దు యుహీ వ యుమీతు బి యదిహిల్ ఖైర్ వహువ అలా కుల్లి షయ్యిన్ కదీర్

# ఈమాన్ (విశ్వాసం)

اٰمَنْتُ بِاللّٰهِ وَمَلٰئِكَتِهٖ وَكُتُبِهٖ وَرُسُلِهٖ وَالْيَوْمِ الْاٰخِرِ وَالْقَدْرِ
خَيْرِهٖ وَشَرِّهٖ مِنَ اللّٰهِ تَعَالٰى وَالْبَعْثِ بَعْدَ الْمَوْتِ ؞

ఆమన్తు బిల్లాహి వ మాలాయికతిహి వ కుతుబిహి వ రుసులిహి వల్ యౌమిల్ ఆఖిరి వల్ ఖద్రి ఖైరిహి వ షర్రిహి మినల్లాహి తఆలా వల్ బఅసి బ'దల్ మౌత్.

నేను విశ్వసించాను – అల్లాహ్‌ను, ఆయన దూతల్ని, ఆయన గ్రంథాలను, ఆయన ప్రవక్తల్ని, పరలోక తీర్పు దినాన్ని, మంచిదయినా చెడు అయినా జరిగేది అల్లాహ్ తరపునే అని, మరణించిన పిదప తీర్పు దినాన తిరిగి లేపబడే విషయాన్ని.

ఈమాన్ అయిదు కలిమాలతో పూర్తవుతుంది.

మొదటి కలిమా

لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ مُحَمَّدٌ رَّسُوْلُ اللّٰهِ

లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్ రసూలుల్లాహి

అల్లాహ్ తప్ప మరెవరూ ఆరాధనకు తగిన వారు లేరు, ముహమ్మద్ (సఅసం) ఆయన ప్రవక్త.

రెండవ కలిమా

اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَحْدَهٗ لَا شَرِيْكَ لَهٗ
وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ ؞

తదనుగుణంగా ప్రకటిస్తున్నాను: అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడూ లేడు ముహమ్మద్(సఅసం) అల్లాహ్ సందేశహరుడు.

# 2
# పరిశుభ్రత – పరిశుద్ధత

నమాజ్ చెయ్యడానికి శరీరం, ధరించిన దుస్తులు, నమాజ్ చేసే స్థలం పరిశుద్ధంగా ఉండాలి. దేహ పరిశుద్ధత (అ) శరీర అవయవాలన్నింటి ప్రక్షాళన చెయ్యడం (గుసుల్-స్నానం) వల్లనూ (ఆ) నమాజ్‌కు పూర్వం బయటికి కనిపించే అవయవాలని పరిశుభ్రపరచటం (వుజూ) వల్లనూ సాధ్యమవుతుంది. గుసుల్ చేసేటప్పుడు ముందు మర్మాంగాలను పరిశుభ్రపరచుకుని తరువాత తలనుండి పాదాల వరకు సకల అంగాలను పరిశుభ్రపరచుకోవాలి.

**1. గుసుల్ (స్నానం) :** ఇది తప్పనిసరి విధి అవుతుంది – (అ) సంభోగం తరువాత (ఆ) స్ఖలనం జరిగినప్పుడు లేక వీర్యం అంగంనుండి వెలికి వచ్చినప్పుడు (ఇ) రుతుస్రావం ముగిసిన తరువాత మరియు పురుడు పోసుకున్న తరువాత.

విధి అయిన గుసుల్‌ను చెయ్యడంలో అనుసరించవలసిన ఉత్తమ పద్ధతి ఇది : షరీఅత్ ఆదేశానుసారం దేహాన్ని పరిశుద్ధం చేసుకునే సంకల్పం (నియ్యత్) చేసుకోవాలి. తరువాత కుడి చేత్తో నీరు తీసుకుని రెండు చేతులూ మూడు సార్లు ముంజేతుల వరకు కడుక్కోవాలి. తరువాత మర్మాంగాలను కడుక్కోవాలి. ఇంకా దేహంపై మరెక్కడయినా మలినం అంటి ఉంటే దాన్ని పరిశుభ్రపరచుకోవాలి. ఆ తరువాత రెండు చేతులు పరిశుభ్రం చేసుకుని

అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడు. ఆయన ఒక్కడే. ఆయనకు ఎవరూ సహవర్తుడు కాడు. (విశ్వ) రాచరికం ఆయనకే చెల్లు. ఆయనకే స్తోత్రం. ఆయనే బ్రతికిస్తాడు; ఆయనే మృత్యువునిస్తాడు. మంచిది ఆయనకే హస్తగతమయి ఉంది. అన్నిటా శక్తిమంతుడు ఆయనే.

**అయిదవ కలిమా**

اَللّٰهُمَّ اِنِّيْٓ اَعُوْذُ بِكَ مِنْ اَنْ اُشْرِكَ بِكَ شَيْـئًا وَّ اَنَا اَعْلَمُ بِهٖ وَاَسْتَغْفِرُكَ لِمَا لَا اَعْلَمُ بِهٖ اِنَّكَ اَنْتَ عَلَّامُ الْغُيُوْبِ تُبْتُ عَنْهُ وَتَبَرَّأْتُ عَنْ كُلِّ دِيْنٍ سِوٰى دِيْنِ الْاِسْلَامِ وَاَسْلَمْتُ وَاَقُوْلُ لَآ اِلٰـهَ اِلَّا اللّٰهُ مُحَمَّدٌ رَّسُوْلُ اللّٰهِ ؕ

*అల్లాహుమ్మ ఇన్నీ అఊజుబిక మిన్ అన్ ఉష్రిక బిక షయ్యఁవ్వ అన ఆలము బిహీ, వఅస్‌తగ్‌ఫిరుక లిమాలా ఆలము బిహీ, ఇన్నక అన్త అల్లాముల్ గుయూబ్. తుబ్తు అన్‌హు వ తబర్ర తు అన్ కుల్లి దీనిన్ సివా దీని ఇస్లామి వ అస్లమ్తు వ అకూలు లా ఇలాహ ఇల్లల్లాహు ముహమ్మదుర్ రసూలుల్లాహి.*

అల్లాహ్! నిశ్చయంగా నేను నీ శరణు వేడుకుంటున్నాను – తెలిసీ నీతో పాటు మరెవరినయినా నీ సహవర్తులుగా భావించడం పట్ల! నాకు తెలియకుండా జరిగిన అపరాధాలకు నీ మన్నింపుకై అర్థిస్తున్నాను. నిస్సందేహంగా నీవు సకల అగోచర విషయాలూ తెలిసినవాడవు; నేను వాటి (అపరాధాల) పట్ల పశ్చాత్తాపాన్ని వ్యక్త పరుస్తున్నాను. నేను ఇస్లాం తప్ప ఇతర విధానా లన్నింటినుండి దూరమయ్యానని ఆ విషయంలో నా సంబంధరాహిత్యాన్ని చాటుతున్నాను. నేను ఇస్లామ్‌ను స్వీకరించాను, దాన్ని విశ్వసించాను.

ఏ పదార్థమయినా బయల్పడటం 3. మలస్థానం నుండి వాయు (అపానవాయు) విసర్జన 4. శరీరంలోని ఏ భాగం నుండయినా రక్తం, చీము కారి ప్రవహించడం 5. నోటినిండా వాంతి చేసుకోవడం 6. పడుకుని లేక దేని ఆధారంగానయినా వ్రాలి నిద్ర పోవడం 7. స్పృహ కోల్పోవడం 8. మతి చలించడం 9. ప్రాజ్ఞతగల మనిషి నమాజ్‌లో బిగ్గరగా నవ్వడం 10. ఉమ్మిలో రక్తం అధికంగా రావటం.

**3. తయమ్ముమ్ :** ఇది నీరు లభ్యం కాని సందర్భాలలో గుసుల్‌కు బదులు, వుజూకు బదులుగా అనుసరించే విధానం. 1. నీరు ఒక మైలు దూరంలోపు లభించనప్పుడు 2. నీటి ప్రయోగం వల్ల వ్యాధి కలిగే లేక వ్యాధి అధికమయ్యే ఆస్కారమున్నప్పుడు 3. శత్రుభయం వల్ల నీరు తెచ్చుకోవడం సాధ్యం కానప్పుడు, బావినుండి నీరు చేదుకోవడం వీలుకాకపోయినప్పుడు, 4. ప్రయాణంలో త్రాగడానికి మటుకే నీరున్నప్పుడు 5. ప్రయాణంలో వుజూచేసేందుకు వీలు లేకపోయినప్పుడు 6. జనాజా నమాజ్ లేక ఈద్ నమాజ్‌కు అందకుండా పొయ్యే ప్రమాదముంటే – తయమ్ముమ్ చెయ్యడం ధర్మ సమ్మతమే.

**తయమ్ముమ్ విధానం :** పరిశుద్ధత పొందడానికి తయమ్ముమ్ చేస్తున్నానని నియ్యత్ (సంకల్పం) చేసుకోవాలి. తరువాత బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం పఠించి రెండు చేతులూ వ్రేళ్ళతో సహా పరిశుద్ధమయిన పొడి మన్నుపై అదమాలి. ఆ తరువాత చేతుల్ని బాగా విదిలించి ముఖమంతా తడుముకోవాలి. రెండోసారి కూడా రెండు చేతులు పొడిమన్నుపై అదిమి, విదిలించి రెండు చేతుల్ని మోచేతుల వరకు – కుడి చేతిని ఎడమ చెయ్యితోను, ఎడమ చేతిని కుడి చేత్తోనూ తడుముకోవాలి. నీరు ప్రాప్తం కాగానే లేక వ్యాధి దూరం కాగానే తయమ్ముమ్ భంగమవుతుంది. వుజూ చేసుకోవడం తప్పనిసరి.

వుజూ చెయ్యాలి. తరువాత తల వెంట్రుకలు, మర్మాంగాలు సమేతంగా తలనుండి పాదాల వరకు శరీరం అంతా పరిశుభ్రం చేసుకుని కనీసం మూడు సార్లు పారేలా నీరు పోసుకోవాలి.

**2. వుజూ :** వుజూ అంటే సాధారణంగా ఆచ్ఛాదన లేకుండా ఉండే శరీర భాగాలను పరిశుభ్ర పరచుకోవడం అన్నమాట. వుజూలోని ముఖ్యాంశాలు: 1.వుజూ నియ్యత్ (సంకల్పం) చేసుకోవడం 2. నీరు పరిశుద్ధమయిన దయిఉండటం 3. బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీం పఠించడం 4. రెండు చేతుల్ని ముంజేతుల వరకు మూడుసార్లు కడుక్కోవడం 5. పళ్లను మిస్వాక్ (పలుదోముపుల్ల)తో గాని వ్రేలుతోగాని తోమడం 6. ముక్కులో నీరు ఎక్కించి మూడుసార్లు పరిశుభ్ర పరచడం. 7. ముంగురులు మొదలుకుని నుదుటితో సహా గడ్డం వరకు ఇంకా కుడి చెవినుండి ఎడమ చెవి వరకు మొత్తం ముఖాన్ని మూడుసార్లు కడుక్కోవడం. 8. ముందు కుడి చెయ్యి తరువాత ఎడమ చెయ్యి మోచేతుల వరకు మూడు సార్లు కడుక్కోవడం 9. రెండు అరచేతుల్ని నీటితో తడిపి తలపై 'మసహ్' చెయ్యడం (స్పర్శించడం). అలాగే చూపుడు వ్రేళ్ళతో చెవుల లోపలి భాగాలను, బొటన వ్రేళ్ళతో వెలుపలి భాగాలను 'మసహ్' (తడమడం) చెయ్యాలి. ఇంకా చేతి వ్రేళ్ళ వెనకటి భాగంతో మెడను 'మసహ్' చెయ్యాలి. 10. ముందు కుడి పాదం తరువాత ఎడమ పాదం చీలమండలాల వరకు మూడు పర్యాయాలు శుభ్రం చెయ్యఢం.

నమాజ్ చెయ్యడానికి, దివ్యఖుర్ఆన్‌ను ముట్టుకోవడం, చదవడం కొరకు, కాబా ప్రదక్షిణం కోసం, కాబాలో ప్రవేశించేందుకు వుజూ చెయ్యడం అవసరం.

**వుజూను భంగపరిచే విషయాలు :** ఈ విషయాలవల్ల వుజూ భంగమవుతుంది: 1. మలమూత్ర విసర్జన 2. మలమూత్ర స్థానాలనుండి

ఫిత్ర్ : రమజాన్ రోజా వ్రతాలు ముగిసిన పిదప జరుపుకుంటారు. 8. ఈదుల్ అజ్హా : జిల్‌హజ్జ పదవ తారీఖున జరుపుకుంటారు. ఇది హజ్రత్ ఇబ్రాహీమ్, హజ్రత్ ఇస్మాయీల్ (అలైహిముస్సలామ్) చేసిన మహోన్నత త్యాగానికి జ్ఞాపకార్థం జరుపుకునే పండుగ.

రెండు పండుగల నమాజ్ వేళ, సూర్య కాంతి బాగా వ్యాపించిన తరువాత ప్రారంభమయి, సూర్యుడు నడినెత్తిన ఎక్కేవరకు ఉంటుంది.

<table>
<tr><th colspan="6">నమాజుల పట్టిక</th></tr>
<tr><th>నమాజ్ పేరు</th><th>ఫర్జ్‌కుపూర్వం సున్నతులు</th><th>ఫర్జ్</th><th>ఫర్జ్‌కు తరువాత సున్నతులు</th><th>నఫిల్ నమాజ్</th><th>వాజిబ్ నమాజ్</th></tr>
<tr><td>ఫజ్ర్</td><td>2</td><td>2</td><td colspan="3">ఫర్జ్ నమాజ్ తరువాత సూర్యోదయం వరకు మరో నమాజ్ లేదు</td></tr>
<tr><td>జొహర్</td><td>4</td><td>4</td><td>2</td><td>2</td><td>-</td></tr>
<tr><td>అస్ర్</td><td>4</td><td>4</td><td colspan="3">అస్ర్ తరువాత సూర్యాస్తమయం వరకు మరే నమాజ్ లేదు.</td></tr>
<tr><td>మగ్రిబ్</td><td>-</td><td>3</td><td>2</td><td>2</td><td>-</td></tr>
<tr><td>ఇషా</td><td>4</td><td>4</td><td>2</td><td>2</td><td>3</td></tr>
<tr><td>జుమా</td><td>2+4</td><td>2</td><td>4</td><td>2</td><td>-</td></tr>
<tr><td>ఈదుల్ ఫిత్ర్</td><td colspan="4" rowspan="2">పండుగల్లో కేవలం రెండు రకాతుల వాజిబ్ నమాజ్ మాత్రమే చేస్తారు. ఆ తరువాత ఖుత్బా ప్రసంగం జరుగుతుంది.</td><td>2</td></tr>
<tr><td>ఈదుల్ అజ్హా</td><td>2</td></tr>
</table>

మలమూత్ర విసర్జన తరువాత ఆయా భాగాలను నీరు లేనప్పుడు మట్టిపెడ్డలతోనూ ఆ తరువాత నీటితోనూ శుభ్రపరచుకోవడం ముఖ్యం.

# 3

# నమాజ్

## అయిదు వేళల నమాజులు, రకాతుల సంఖ్య, సమయం

**అ) నమాజ్ :** ఈమాన్ తరువాత రెండవ ముఖ్యమయిన విధి నమాజ్. ఇది ప్రాజ్ఞాలయిన ప్రతి ముస్లిమ్ స్త్రీ పురుషులకు రేయింబవళ్ళల్లో అయిదు వేళలు విధిగా నిర్ణయమయింది. ఏడేళ్ళు నిండగానే బాలబాలికలకు నమాజ్‌ని నిర్దేశించడం విధి.

**నమాజ్ నాలుగు రకాలు :** 1. ఫర్జ్ నమాజ్ 2. వాజిబ్ నమాజ్ 3. సున్నత్ నమాజ్ (ఇది ఫర్జ్ కాకపోయినా దీన్ని దైవప్రవక్త (సఅసం) క్రమబద్ధంగా చేసేవారు.) 4. నఫిల్ నమాజ్

**ఆ) నమాజ్ వేళలు :** ఫజ్ర్ నమాజ్ ఉషోదయం తరువాత సూర్యోదయానికి పూర్వం వరకు చెయ్యవచ్చు. 2. జుహర్ నమాజ్ వేళ సూర్యుడు నడినెత్తి నుండి పడమర వైపుకు మరలిన తరువాత ప్రారంభమయి, ఒక వస్తువు నీడ దానికి రెండింతలయ్యేవరకు ఉంటుంది. 3. అస్ర్ సమయం, జుహర్ సమయం ముగిసిన తరువాత ప్రారంభమయి సూర్యాస్తమయం వరకు ఉంటుంది. 4. మగ్రిబ్ వేళ సూర్యాస్తమయం తరువాత పశ్చిమాన ఎరుపురంగు కానరానంత వరకు ఉంటుంది. దాదాపు 1 గంట, 15 నిముషాలు. 5. ఇషా వేళ సూర్యాస్తమయానికి గంటన్నర తరువాత ప్రారంభమయి ఉషోదయం వరకు ఉంటుంది. 6. జుమా సమయం : జుహర్ మాదిరిగానే 7. ఈదుల్

ముహమ్మద్ (సఅసం) అల్లాహ్ సందేశహరుడని నేను సాక్ష్యమిస్తున్నాను (రెండుసార్లు)

حَيَّ عَلَى الصَّلٰوةُ حَيَّ عَلَى الصَّلٰوةُ

హయ్య అలస్సలాహ్, హయ్య అలస్సలాహ్

నమాజ్‌కై రండి, (రెండు మార్లు - కుడివైపునకు తిరిగి)

حَيَّ عَلَى الْفَلَاحُ حَيَّ عَلَى الْفَلَاحُ

హయ్య అలల్ ఫలాహ్, హయ్య అలల్ ఫలాహ్

సాఫల్యం వైపుకు రండి, (రెండుమార్లు - ఎడమ వైపునకు తిరిగి)

اَللّٰهُ اَكْبَرْ اَللّٰهُ اَكْبَرْ

అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్

అల్లాహ్ గొప్పవాడు (రెండు మార్లు)

لَا اِلٰهَ اِلَّا اللّٰهُ

లా ఇలాహ ఇల్లల్లాహ్

అల్లాహ్ తప్ప ఆరాధనకు యోగ్యమయినది ఏదీ లేదు.

ఫజ్ర్ నమాజ్‌కు చేసే అజాన్‌లో 'హయ్య అలల్ ఫలాహ్' కు తరువాత

اَلصَّلٰوةُ خَيْرٌ مِّنَ النَّوْمِ
اَلصَّلٰوةُ خَيْرٌ مِّنَ النَّوْمِ

అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్

అస్సలాతు ఖైరుమ్ మినన్నౌమ్

నమాజ్ నిద్ర కంటే మేలయినది (రెండుమార్లు)

# 4
# అజాన్ మరియు ఇకామత్

నమాజ్ వేళ అయినప్పుడు దాన్ని సూచించేందుకు 'ముఅజ్జిన్' ఇచ్చే పిలుపు లేక ప్రకటనకు అజాన్ అని పేరు. ఇది అరబీ భాషలో బిగ్గరగా చెయ్యబడుతుంది. దాని వచనాలు ఇవి

అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్, اَللّٰهُ اَكْبَرْ اَللّٰهُ اَكْبَرْ

అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్. اَللّٰهُ اَكْبَرْ اَللّٰهُ اَكْبَرْ

అల్లాహ్ గొప్పవాడు (నాలుగుమార్లు)

అష్హదు అన్లా ఇలాహ ఇల్లల్లాహ్, اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ

అషహదు అన్ లా ఇలాహ ఇల్లల్లాహ్. اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ

అల్లాహ్ తప్ప మరేదీ ఆరాధనకు అర్హమయినది కాదని నేను సాక్ష్యమిస్తున్నాను. (రెండుమార్లు)

اَشْهَدُ اَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللّٰهِ

అష్హదు అన్న ముహమ్మదన్ రసూలుల్లాహ్

اَشْهَدُ اَنَّ مُحَمَّدًا رَّسُوْلُ اللّٰهِ

అష్హదు అన్న ముహమ్మదన్ రసూలుల్లాహ్

# 5

# నమాజ్ చేసే పద్ధతి

నమాజ్ పద్ధతిలో ప్రముఖమయింది, ప్రపంచంలో ఏ భూభాగాన ఉన్నవారయినా సరే, నమాజ్ చేసేవారు దైవ గృహమయిన కాబా వైపునకు అభిముఖులయి నిలువాలి. ఇమామ్ (నమాజ్ చేయించే నాయకుడు) మస్జిద్ మహ్రాబ్‌లోను, అనుసరించే ముక్తదీలు బారులు తీరి కాబా వైపునకు తిరిగి నిలిచినప్పుడు ముఅజ్జిన్ ఇకామత్‌ను ప్రకటిస్తాడు. ఇది అజాన్ మాదిరిగానే ప్రకటిస్తాడు. అయితే హయ్యా అలస్సలాహ్ తరువాత -

కద్ కామతిస్సలాత్ قَدْ قَامَتِ الصَّلٰوةُ

నమాజ్ జరుగుతోంది (అని రెండు మార్లు చెప్పి అజాన్‌ను పూర్తి చేస్తాడు.)

(అ) సున్నత్ నమాజ్ వ్యక్తిగతంగా చెయ్యబడుతుంది - రమజాన్‌లో చేసే తరావీహ్ నమాజ్ తప్ప. సున్నత్ నమాజుల రకాతుల వివరాలు నమాజ్ పట్టికలో సూచించడం జరిగింది. (ఆ) ఫర్జ్ నమాజ్ ఇమామ్ అనుసరణలో, జమాఅత్‌తో సహా చెయ్యబడుతుంది. ఎవరయినా ఫర్జ్ నమాజ్ జమాఅత్‌తో చెయ్యలేకపోతే దాన్ని వ్యక్తిగతంగానే పూర్తి చేసుకోవాలి - సున్నత్ నమాజ్ మాదిరిగా.

నమాజ్ వేళలు, ఫర్జ్ నమాజ్, సున్నత్ నమాజ్, నఫిల్, వాజిబుల్ విత్ర్ నమాజ్ రకాతుల వివరాలు నమాజ్ పట్టికలోనే ఇవ్వడం జరిగింది.

(ఇ) నమాజ్ ప్రారంభించే ముందు నమాజ్ నియ్యత్ (సంకల్పం) చేసుకోవడం

అజాన్ ముగిసిన తరువాత దాన్ని వినేవారు, ప్రకటించే వ్యక్తి (ముఅజ్జిన్) కూడా దరూద్ పఠించి క్రింది దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ رَبَّ هٰذِهِ الدَّعْوَةِ التَّامَّةِ وَالصَّلَاةِ الْقَائِمَةِ اٰتِ سَيِّدَنَا مُحَمَّدَنِ الْوَسِيْلَةَ وَالدَّرَجَةَ الرَّفِيْعَةَ الْعَالِيَةَ الشَّرِيْفَةَ وَابْعَثْهُ مَقَامًا مَّحْمُوْدَانِ الَّذِيْ وَعَدْتَّهٗ وَارْزُقْنَا شَفَاعَتَهٗ وَاَوْرِدْنَا حَوْضَهٗ يَوْمَ الْقِيٰمَةِ اِنَّكَ لَا تُخْلِفُ الْمِيْعَادَ

అల్లాహుమ్మ రబ్బ హాజిహి ద్దావతిత్తామ్మతి, వస్సలాతిల్ కాయిమతి, ఆతి సయ్యిదినా ముహమ్మదనిల్ వసీలత, వద్దరజతర్రఫీ అతల్ ఆలియత షరీఫత, వబ్ అస్హు మకామ మ్మహ్మూద నిల్లజీ వఅద్త హు, వర్జుక్నా షఫాఅతహు, వ ఔరిద్నా హౌజహు యౌమల్ కియామతి, ఇన్నక లా తుఖ్లిఫుల్ మీఆద్.

ఓ అల్లాహ్! ఈ పరిపూర్ణ (తౌహీద్ - దేవుని ఏకత్వం) ఆహ్వానానికి, స్థాపనమయ్యే నమాజుకు ప్రభువా! ముహమ్మద్(సఅసం) కు నీ సామీప్యాన్ని ఔన్నత్యాన్ని, ఉన్నత స్థానాన్ని ప్రసాదించు. ప్రళయ దినాన మాకు ఆయన సిఫారసు మహాభాగ్యాన్ని కలుగజెయ్యి. మమ్మల్ని ఆయన కోనేటికి చేరవెయ్యి. నిస్సందేహంగా నీవు నీ వాగ్దానాన్ని భంగం చెయ్యవు.

اِنِّیْ وَجَّهْتُ وَجْهِیَ لِلَّذِیْ فَطَرَ السَّمٰوٰتِ وَالْاَرْضَ حَنِیْفًا وَّ
مَآ اَنَا مِنَ الْمُشْرِکِیْنَ ؕ

ఇన్నీ వజ్జహ్‌తు వజ్‌హియ లిల్లజీ ఫతరస్సమావాతి వల్‌అర్జ హనీఫ, వ్వమా అన మినల్ ముష్రికీన్

భూమ్యాకాశాలను సృజించిన శక్తి వైపునకు ఏకోన్ముఖుడనయి మరలాను. నేను షిర్క్ (బహుదైవోపాసన) చేసేవారిలోని వాణ్ణి కాను.

2. ఆ తరువాత 'అల్లాహు అక్బర్' అని పలుకుతూ రెండు చేతులూ చెవుల వరకు ఎత్తాలి. వ్రేళ్ళు నిటారుగా ఉంచాలి. అరచెయ్యి కిబ్లా (కాబా) వైపునకు తిరిగి ఉండాలి. బొటన వ్రేళ్ళతో చెవుల క్రింది భాగాన్ని తాకి రెండు చేతులూ క్రిందికి దింపాలి. ఆ తరువాత చేతులు నాభి స్థానంపై కట్టుకోవాలి. ఎడమ చెయ్యిపై కుడి చేయి కట్టుకోవాలి.



అవసరం. నోటితో - ఏ భాషలోనయినాసరే - పలకడం ఉత్తమం. లేక మనసులో అనుకున్నా సరిపోతుంది.

# నియ్యత్ వివరాలు

నమాజ్ చేసేందుకు నిల్చున్నప్పుడు ఏ వేళ నమాజ్ చేస్తున్నామో, ఎన్ని రకతులు చెయ్యబోతున్నామో నియ్యత్(సంకల్పం) చేసుకోవడం నమాజ్‌లో ముఖ్యమయిందని చదివాము. ఆ నియ్యత్ అరబీ వచ్చినవారు అరబీ భాషలోను లేదా తమ మాతృభాషలోను లేదా కనీసం ఆ వివరాలను మనసులో అనుకోవడం అత్యంతావశ్యకం. దాని పదాలు ఇలా ఉండాలి.

"నేను ..... (ఇన్ని) రకతుల ..... (వేళ) (సున్నత్ / ఫర్జ్ / నఫిల్ / వాజిబ్) నమాజ్ అల్లాహ్ కొరకు, కాబా గృహంవైపునకు అభిముఖమయి చేసే సంకల్పం చేశాను."

అని అనుకుని తక్బీర్ (అల్లాహు అక్బర్) పలకాలి. ఇమామ్ వెనక అనుసరించి నమాజ్ చేసేవారు తక్బీర్‌కు పూర్వం "ఈ ఇమామ్‌ని అనుసరిస్తూ" అని కూడా అనుకోవాలి.

# నమాజ్ ఎలా చెయ్యాలి

1. సున్నత్ నమాజ్ చేసే మాటయితే నియ్యత్ చేసుకుని కిబ్లా వైపునకు తిరిగి నిల్చోవాలి. ఆ తరువాత (ఫర్జ్ నమాజ్ అయితే ముఅజ్జిన్ ఇకామత్ ప్రకటించిన తరువాత) ఇది పఠించండి :

الرَّحْمٰنِ الرَّحِيْمِ ۙ
అర్రహ్మా నిర్రహీమ్

కరుణామయుడు, దయాసాగరుడు

مٰلِكِ يَوْمِ الدِّيْنِ ۗ
మాలికి యౌమిద్దీన్

తీర్పు దినపు యజమాని

اِيَّاكَ نَعْبُدُ وَاِيَّاكَ نَسْتَعِيْنُ ۗ
ఇయ్యాక న'బుదు వఇయ్యాక నస్తయీన్
మేము నిన్నే ఆరాధిస్తాము, సహాయం కొరకు నిన్నే అర్థిస్తాము

اِهْدِنَا الصِّرَاطَ الْمُسْتَقِيْمَ ۙ
ఇహ్దినస్సిరాతల్ ముస్తకీమ్

మాకు సన్మార్గాన్ని చూపు

صِرَاطَ الَّذِيْنَ اَنْعَمْتَ عَلَيْهِمْ ۙ
సిరాతల్లజీన అన్ అమ్త అలైహిమ్

ఎవరిపై నయితే నీవు బహుమానాలను కురిపించావో

غَيْرِ الْمَغْضُوْبِ عَلَيْهِمْ وَلَا الضَّآلِّيْنَ ۧ
గైరిల్ మగ్‌జూబి అలైహిమ్, వలజ్జాల్లీన్ (ఆమీన్)

ఎవరిపై నయితే నీ ఆగ్రహం వర్షించ లేదో మరెవరయితే మార్గ భ్రష్టులు

3. అప్పుడు సనా పఠించాలి, సనా :

سُبْحَانَكَ اللّٰهُمَّ وَبِحَمْدِكَ وَتَبَارَكَ اسْمُكَ وَتَعَالٰى جَدُّكَ وَلَا اِلٰـهَ غَيْرُكَ ؕ

సుబ్‌హానకల్లాహుమ్మ వ బిహమ్దిక వతబారకస్ముక వతఆలా జద్దుక వలా ఇలాహ గైరుక్.

అల్లాహ్, నీవు పరిశుద్ధమయిన వాడివి. స్తోత్రంకూడా నీకే చెల్లు. నీ పేరు ఎంతో శుభప్రదమయింది. నీ గొప్పతనం ఎంతో ఉన్నతమయింది. నీవు తప్ప మరే ఆరాధ్యుడే లేడు.

4. ఆ తరువాత

اَعُوْذُ بِاللّٰهِ مِنَ الشَّيْطٰنِ الرَّجِيْمِ

అవుజు బిల్లాహి మినష్షయితా నిర్రజీమ్

అల్లాహ్ శరణు వేడుకుంటున్నాను - ఛీత్కరింపబడిన షైతాన్ బారినుండి.

5. ఫాతిహా సూరా పఠించాలి

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అపార కృపాశీలుడు, పరమదయామయుడు అయిన అల్లాహ్ పేరుతో

اَلْحَمْدُ لِلّٰهِ رَبِّ الْعٰلَمِيْنَ ۝

అల్ హమ్దు లిల్లాహి రబ్బిల్ ఆలమీన్

స్తోత్రం అల్లాహ్ కొరకే. ఆయన సకల లోకాలకు ప్రభువు

لَمْ يَلِدْ ۙ وَلَمْ يُوْلَدْ ۙ

లమ్ ఎలిద్ వలమ్ యూలద్

ఆయనకు ఏ సంతానమూ లేదు, ఆయన ఎవరికీ సంతానం కాదు.

وَلَمْ يَكُنْ لَّهٗ كُفُوًا اَحَدٌ ۧ

వలమ్ ఎకున్ లహు కుఫు అన్ అహద్

ఆయనకు ఎవరూ సమానులు కారు

7. తరువాత అల్లాహు అక్బర్ అని పలుకుతూ రుకూ చెయ్యాలి.



అంటే నడుము, తల రెండూ ఒకే స్థాయిలో ఉండేలా వంగాలి. అరచేతుల్ని మోకాళ్ళపై ఆనించాలి.

అప్పుడు ఈ వచనం మూడు మార్లు పలకాలి.

سُبْحَانَ رَبِّيَ الْعَظِيْمِ

సుబహాన రబ్బి అల్ అజీమ్

మహోజ్వలుడయిన నా ప్రభువు పరమ పవిత్రుడు.

8. ఆ తరువాత తిరిగి లేస్తూ చేతులు క్రిందికి వదిలేసి నిలుచోవాలి. అప్పుడు

కాలేదో - (వారి మార్గాన్ని!)

దీన్ని ముగించి 'ఆమీన్' (అలాగే జరుగుగాక) అని పలుకాలి.

6. ఆ తరువాత దివ్యఖుర్‌ఆన్‌లో బాగా జ్ఞాపకమున్న ఏదయినా సూరాని లేక దాని భాగాన్ని పఠించాలి. జమాఅత్‌తో నమాజ్ చేసేటప్పుడు ఇమామ్ పఠిస్తాడు. ఇమామ్, ఫజ్ర్, మగ్‌రిబ్, ఇషా నమాజుల్లో బిగ్గరగాను, జుహర్, అస్ర్ నమాజుల్లో నిశ్శబ్దంగానూ పఠించాలి. సాధారణంగా పఠించబడే కొన్ని చిన్న చిన్న సూరాలు ఈ పుస్తకం చివరన పొందుపరిచాము. పాఠకులు నేర్చుకోవడానికి సులువుగా ఉండాలని తెలుగు లిపిలో కూడా ఈ సూరాలు ముద్రించాము. ఉదాహరణకు ఇఖ్లాస్ సూరా :

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అపార కృపాశీలుడు పరమదయామయుడు అయిన అల్లాహ్ పేరుతో..

قُلْ هُوَ اللّٰهُ اَحَدٌ ○

కుల్ హు వల్లాహు అహద్

చెప్పండి, ఆయన - అల్లాహ్ - ఒక్కడే

اَللّٰهُ الصَّمَدُ ○

అల్లాహుస్సమద్

అల్లాహ్‌పైనే అందరూ ఆధారపడతారు (ఆయన ఎవరిపైనా ఆధారపడడు)

సుబహాన రబ్బి అల్ ఆలా అని మూడు సార్లు పఠించాలి.

11. ఆ తరువాత లేచి నిలబడుతూ అల్లాహు అక్బర్ అని పలకాలి. అప్పుడు ప్రారంభంలో నిలబడినట్లే కుడిచెయ్యి, ఎడమ చెయ్యిపై వేసి కట్టుకుని నిల్చోవాలి. ఇక ఒక రకాత్ ముగిసింది, రెండవ రకాత్ ప్రారంభమయింది. ఇందులో ఫాతిహా సూరా (పేజి.14), మరో సూరా (ఉదాహరణకు నాస్ సూరా) పఠించాలి.

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

బిస్మి ల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అపార కృపాశీలుడు పరమ దయామయుడు అయిన అల్లాహ్ పేరుతో..

قُلْ اَعُوْذُ بِرَبِّ النَّاسِ ۝۱

కుల్ అవుజు బి రబ్బిన్నాస్

చెప్పండి, నేను, మానవుల పరిపోషకుడు, ప్రభువు

مَلِكِ النَّاسِ ۝

మలికిన్నాస్

మానవుల పరిపాలకుడు

اِلٰهِ النَّاسِ ۝

ఇలా హిన్నాస్

మానవుల ఆరాధ్యుడు అయిన వాని శరణు కోరుతున్నాను -

مِنْ شَرِّ الْوَسْوَاسِ ۙ الْخَنَّاسِ ۝

మిన్ షర్రిల్ వస్వాసిల్ ఖన్నాస్

సందేహాలు, సంశయాలు సృజించేవాని చెడు నుండి -

సమి అల్లాహు లిమన్ హమిద , سَمِعَ اللّٰهُ لِمَنْ حَمِدَهٗ

అల్లాహుమ్మ రబ్బనా లకల్ హమ్ద్ اَللّٰهُمَّ رَبَّنَا لَكَ الْحَمْدُ

అల్లాహ్, తన్ను స్తుతించిన వానిని వింటాడు. ప్రభువా స్తోత్రం నీకే చెల్లు అని పఠించాలి.

9. ఆ తరువాత అల్లాహు అక్బర్(దేవుడు గొప్పవాడు) అని పలుకుతూ సజ్దా చెయ్యాలి.

సజ్దా (సాష్టాంగ ప్రణామం) లో రెండు కాళ్ళ బొటనవ్రేళ్ళు, రెండు మోకాళ్ళు, రెండు అరచేతులు, ముక్కు, నుదురు - ఇవన్నీ నేలను తాకాలి.



అప్పుడు

సుబహాన రబ్బియల్ ఆలా سُبْحَانَ رَبِّيَ الْاَعْلٰى

ఉన్నతుడయిన నా ప్రభువు పరిశుద్ధుడు

అని మూడు సార్లు పఠించాలి.

10. అప్పుడు అల్లాహు అక్బర్( దేవుడు గొప్పవాడు) అని పలుకుతూ కొన్ని సెకన్లు కూర్చోవాలి. ఎడమ కాలిని పరిచి, కుడికాలి వ్రేళ్ళ ఆధారంగా కూర్చోవాలి. రెండు చేతులు తొడలపై మోకాళ్ళ దగ్గర ఉంచాలి. ఆ పిదప తిరిగి సజ్దా చేస్తూ

కలపలో 'తషహ్హుద్' లేక 'అత్తహియ్యాత్' పఠించాలి :

اَلتَّحِيَّاتُ لِلّٰهِ وَالصَّلَوٰاتُ وَالطَّيِّبَاتُ اَلسَّلَامُ عَلَيْكَ اَيُّهَا النَّبِيُّ وَرَحْمَةُ اللّٰهِ وَبَرَكَاتُهٗ اَلسَّلَامُ عَلَيْنَا وَعَلٰى عِبَادِ اللّٰهِ الصَّالِحِيْنَ اَشْهَدُ اَنْ لَّآ اِلٰهَ اِلَّا اللّٰهُ وَاَشْهَدُ اَنَّ مُحَمَّدًا عَبْدُهٗ وَرَسُوْلُهٗ ؞

అత్తహియ్యాతు లిల్లాహి వస్సలవాతు వత్తయ్యిబాతు అస్సలాము అలైక అయ్యుహన్నబియ్యు వరహ్మతుల్లాహి వ బరకాతుహు. అస్సలాము అలైనా వ అలా ఇబాదిల్లాహిస్సాలిహీన్. అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వ రసూలుహ్.

సకల శరీర సంబంధమయిన, ధన సంబంధమయిన, నోటి సంబంధమయిన ఆరాధనలు అల్లాహ్‌కే చెల్లు. ఓ ప్రవక్తా! మీపై శాంతి నెలకొనుగాక, అల్లాహ్ కారుణ్యం, ఆయన శుభాలు వర్షించుగాక! మాపై, అల్లాహ్ దాసులయిన సజ్జనులపై శాంతినెలకొనుగాక. అల్లాహ్ తప్ప మరే ఆరాధ్యుడు లేడని నేను సాక్ష్యమిస్తున్నాను. ముహమ్మద్(సఅసం) అల్లాహ్ దాసుడు, సందేశహరుడని కూడా నేను సాక్ష్యమిస్తున్నాను.

అష్హదు అల్లా ఇలాహ ఇల్లల్లాహు అని పఠించేటప్పుడు చూపుడు వ్రేలు (కలిమా వ్రేలు) ను సూచన ప్రాయంగా లేవనెత్తి మళ్ళీ మామూలుగా ఉంచివెయ్యాలి.

13. రెండు రకాతుల నమాజ్ అయితే తషహ్హుద్ తరువాత దిగువన ఇచ్చిన దరూదె ఇబ్రాహీమి పఠించాలి :

الَّذِیْ یُوَسْوِسُ فِیْ صُدُوْرِ النَّاسِ ۙ

అల్లజీ యువస్ విసు ఫీ సుదూరిన్నాస్

వాడు మాటి మాటికీ కుశంకలు సృజించి వెనక్కి మరలుతూ ఉంటాడు. వాడు మానవుల హృదయాల్లో సంశయాలు సృజిస్తూ ఉంటాడు

مِنَ الْجِنَّةِ وَالنَّاسِ ۙ

మినల్ జిన్నతి వన్నాస్

వాడు జిన్నులకు చెందిన వాడు కావచ్చు, మానవులకు చెందినవాడూ కావచ్చు.

ఆ తరువాత అల్లాహు అక్బర్ అంటూ ఒక రుకూ రెండు సజ్దాలు మొదటి రకత్ మాదిరిగానే చెయ్యాలి. రెండు సజ్దాలు చేసిన తరువాత కూర్చోవాలి. రెండు రకాతుల తరువాత కూర్చునే దాన్ని 'కఅద' అనంటారు.





అల్లాహుమ్మగ్ఫిర్‌లీ వలివాలిదయ్య వలి ఉస్తాజీ వల్‌జమీయిల్ మూమినీన వల్ మూ మినాతి వల్ ముస్లిమీన వల్ ముస్లిమాతి, అల్ అహ్ యాయి మిన్‌హుమ్ వల్ అమ్వాతి ఇన్నక ముజీబుద్దాఅవాతి బిరహ్మతిక యా అర్హమ ర్రాహిమీన్.

ఓ అల్లాహ్ మన్నింపు ప్రసాదించు - నాకు, నా తల్లిదండ్రులకు, నా గురువులకు, విశ్వసించిన స్త్రీ పురుషులకు, నీ విధేయులయిన స్త్రీ పురుషులకు - వీరిలో సజీవులయిన వారికి మృతులయిన వారికి. నిస్సందేహంగా నీవు మొరలాలకించే వాడవు - నీ కారుణ్యంతో - ఓ కరుణాగ్రేసర స్వామీ!

15. చివరన నమాజ్‌ను ముగించేటప్పుడు మొదట కుడి వైపునకు తరువాత ఎడమ వైపునకు మరలి

اَلسَّلَامُ عَلَيْكُمْ وَرَحْمَةُ اللهِ ط

అస్సలాము అలైకుమ్ వరహ్మతుల్లాహి

శాంతి, అల్లాహ్ కారుణ్యం నీపై కలుగుగాక

అని పలకాలి. దీనితో నమాజ్ ముగిసింది.

16. ముఖ్య విషయాలు :

(అ) సున్నత్ నమాజులు వ్యక్తిగతంగానే చెయ్యాలి

(ఆ) ఫర్జ్ నమాజులు వీలయినంత వరకు సామూహికంగా (జమాఅత్‌తో) అదీ మస్జిదుల్లో చెయ్యడం అవసరం.

(ఇ) ఇమామ్ వెనకాల జమాఅత్‌తో పాటు చేసే నమాజుల్లో నియ్యత్ వచనాల్లో ఇమామ్‌ను అనుసరిస్తూ ప్రార్థన జరుపుతున్నానని పలకాలి.

اَللّٰهُمَّ صَلِّ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا صَلَّيْتَ عَلٰى
اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ اَللّٰهُمَّ
بَارِكْ عَلٰى مُحَمَّدٍ وَّعَلٰى اٰلِ مُحَمَّدٍ كَمَا بَارَكْتَ عَلٰى
اِبْرَاهِيْمَ وَعَلٰى اٰلِ اِبْرَاهِيْمَ اِنَّكَ حَمِيْدٌ مَّجِيْدٌ ؕ

అల్లాహుమ్మ సల్లి అలా ముహమ్మదిన్, వ అలా ఆలి ముహమ్మదిన్ కమా
సల్లైత అలా ఇబ్రాహీమ వ అలా ఆలి ఇబ్రాహీమ, ఇన్నక హమీదున్మ్మజీద్.
అల్లాహుమ్మ బారిక్ అలా ముహమ్మదిన్ వ అలా ఆలి ముహమ్మదిన్
కమాబారక్త అలా ఇబ్రాహీమ వ అలా ఆలిఇబ్రాహీమ ఇన్నక హమీదున్మ్మజీద్.

అల్లాహ్! ఏ విధంగానయితే నీవు ఇబ్రాహీమ్ పైనా ఇబ్రాహీమ్ అనుచరులపైనా
నీ కారుణ్యాన్ని, నీ శుభాలను అవతరింపజేశావో అదే విధంగా ముహమ్మద్
పైనా, ముహమ్మద్ అనుచరులపైనా నీ కారుణ్యాన్ని, నీ శుభాలను వర్షింపజెయ్యి.
నిస్సందేహంగా నీవే సకల స్తోత్రాలకు అర్హుడవు నీవే పరమ పవిత్రుడవు.

14. దీని తరువాత దిగువన ఇచ్చిన దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اغْفِرْ لِيْ وَلِوَالِدَيَّ وَلِاُسْتَاذِيْ وَلِجَمِيْعِ
الْمُؤْمِنِيْنَ وَالْمُؤْمِنَاتِ وَالْمُسْلِمِيْنَ وَالْمُسْلِمَاتِ
اَلْاَحْيَاءِ مِنْهُمْ وَالْاَمْوَاتِ اِنَّكَ مُجِيْبُ الدَّعَوَاتِ
بِرَحْمَتِكَ يَا اَرْحَمَ الرّٰحِمِيْنَ ؕ

రెండు రకాతులు చేసి కఅదలో కూర్చొని తషహ్హుద్ పఠించి, అష్హదుఅల్లా ఇలాహ ఇల్లల్లాహు వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహు వరసూలుహు పఠించి, అల్లాహు అక్బర్ అంటూ లేచి మిగతా రకాతులు పూర్తి చేసుకోవాలి. ఫర్జ్ నమాజ్ అయితే మిగతా రకాతుల్లో ఫాతిహా సూరా పఠించి రుకూ సజ్దాలు చేసుకోవాలి. సున్నత్ లేక నఫిల్ అయితే ఫాతిహా సూరాతో పాటు మరే సూరా అయినా పఠించాలి. చివరన తషహ్హుద్, దరూదే ఇబ్రాహీమి, దుఆ పఠించి, సలామ్ చెప్పి నమాజ్ ముగించుకోవాలి.

18. నమాజ్ ముగిసిన తరువాత దుఆ (వేడికోలు) చేసుకోవడం సున్నత్. అలాంటి ఒక దుఆ ఇక్కడ ప్రస్తావిస్తున్నాము....

اَللّٰهُمَّ اَنْتَ السَّلَامُ وَمِنْكَ السَّلَامُ وَاِلَيْكَ يَرْجِعُ السَّلَامُ حَيِّنَا رَبَّنَا بِالسَّلَامِ وَاَدْخِلْنَا بِرَحْمَتِكَ دَارَالسَّلَامِ تَبَارَكْتَ رَبَّنَا وَتَعَالَيْتَ يَا ذَاالْجَلَالِ وَالْاِكْرَامْ ۝

అల్లాహుమ్మ అన్తస్సలాము వ మిన్కస్సలాము, వ ఇలైకయర్జి ఉస్సలాము. హయ్యినా రబ్బనా బిస్సలాము. వ అద్ ఖిల్నా బి రహ్మతిక దారస్సలాము. తబారక్త రబ్బనా వ తఆలైత యా జల్జలాలివల్ ఇక్రామ్.

ఓ అల్లాహ్ శాంతినిచ్చే వాడవు నీవే, నీ వద్దనే శాంతి ప్రాప్తిస్తుంది. అది నీ వైపునకే మరలుతుంది కూడా. ఓ మా ప్రభూ! మా జీవితకాలం మేము శాంతి శ్రేయాలతో జీవించనీ. నీ కారుణ్యానుగ్రహాలతో మమ్మల్ని నీ శాంతి నిలయం (స్వర్గం) లో ప్రవేశింపజెయ్యి. ఓ మా ప్రభూ! నీవు సకల శుభాలకు నిలయం. నీవు మహోన్నతుడవు, పరమోత్తముడవు ఓ

(ఈ) ఏ కారణం వల్లనయినా ఫర్జ్ నమాజ్ జమాఅత్‌తో పాటు చెయ్యడం సాధ్యపడక పోతే వ్యక్తిగతంగానయినా సరే తప్పక చెయ్యాలి.

(ఉ) జమాఅత్‌తో చేసే నమాజ్‌లో ఎవరయినా ఆలస్యంగా వస్తే వెంటనే జమాఅత్‌లో పాల్గొని ఇమామ్‌ను అనుసరించాలి. ఆలస్యంగా వచ్చిన వ్యక్తి ఒక రకాత్ లేక అధికమో కోల్పోతే, అతను, ఇమామ్ సలామ్ చెప్పి ముగించినప్పుడు తాను సలామ్ పలకకుండా లేచి తప్పిన రకాతులు పూర్తి చేసుకోవాలి. ఆలస్యంగా వచ్చిన వారు ఒక రకాత్‌లో రుకూకు పూర్వం, చేరినట్లయితే వారికి ఆ రకాత్ లభించినట్లే. ఒకవేళ రుకూ తరువాత చేరినట్లయితే, ఆ రకాతు తప్పిపోయినట్లే. దాన్ని చివరన పూర్తి చేసుకోవాలి.

(ఊ) జమాఅత్‌తో చేసే నమాజ్‌లో ముక్తదీ (అనుసరించేవారు) కేవలం ఇమామ్‌ను అనుసరించాలి. ఆయన కంటే ముందు ఏదీ ఆచరించరాదు.

(ఎ) జమాఅత్‌తో చేసే నమాజ్‌లో ఇమామ్ సూరాలు పఠిస్తున్నప్పుడు ముక్తదీలు నిశ్శబ్దంగా వినాలి.

(ఏ) జమాఅత్‌తో చేసే నమాజుల్లో ఫజ్ర్, మగ్‌రిబ్, ఇషా నమాజుల్లో తొలి రెండు రకాతుల్లో ఇమామ్ సూరాలు బిగ్గరగా పఠిస్తారు. జుహర్, అస్ర్ నమాజుల్లో నిశ్శబ్దంగా పఠించాలి.

(ఐ) వ్యక్తిగతంగా నమాజ్ చేసుకునేవారు ఫజ్ర్, మగ్‌రిబ్, ఇషా నమాజుల్లో తొలి రెండు రకాతులు బిగ్గరగానయినా లేదా నిశ్శబ్దంగా నయినా పఠించవచ్చు.

17. మూడు రకాతులు లేక నాలుగు రకాతులనమాజ్ చేస్తున్నప్పుడు,

అల్లాహుమ్మ ఇన్నా నస్తయీనుక వనస్తగ్ ఫిరుక, వనూ'మినుబిక, వ నతవక్కలు అలైక, వనుస్ని అలైకల్ ఖైర, వనష్ కురుక, వలా నక్ఫురుక వనఖ్‌లఉ, వనత్‌రుకు మ(య్యఫ్ జురుక అల్లాహుమ్మ ఇయ్యాక న'బుదువలక నుసల్లి, వనస్‌జుదు, వ ఇలైక నస్‌ఆ, వనహ్ ఫిదు వనర్జూ రహ్మతిక వనఖ్‌షా అజాబక, ఇన్న అజాబకల్ జిద్ద బిల్ కుఫ్ఫారి ముల్ హిక్.

ఓ అల్లాహ్, మేము సహాయానికై నిన్నే అర్థిస్తున్నాము. మన్నింపునకై నిన్నే వేడుకుంటున్నాము. నిన్నే విశ్వసిస్తున్నాము, నీ పైనే భరోసా చేస్తున్నాము. ఉత్తమరీతిలో నీ స్తుతినే చేస్తున్నాము. నీకే కృతజ్ఞులమయి ఉంటాము. నీపట్ల కృతఘ్నత తలపెట్టము. నీ అవిధేయునికి దూరంగా ఉంటాము, అతన్ని వదులుకుంటాము. ఓ అల్లాహ్, మేము నిన్నే ఆరాధిస్తాము, నీ కొరకే నమాజ్ చేస్తాము సజ్దా చేస్తాము, నీ మార్గంలోనే పరుగిడుతాము, ఉరకలు వేస్తాము. నీ కారుణ్యాన్నే ఆశిస్తాము. నీ ఆగ్రహానికి భయపడతాము. నిస్సందేహంగా నీ ఆగ్రహం తిరస్కారులపై విరుచుకుపడుతుంది.

కునూత్ దుఆ పఠించి రుకూ, రెండు సజ్దాలు చేసి చివరి కఅదాలో తషహ్హుద్, దరూదె ఇబ్రాహీమి, దుఆయె మాసూరా పఠించి, సలామ్ పలికి నమాజ్ పూర్తి చెయ్యాలి.

గమనిక : (అ) రమజాన్ నెలలో ఈ విత్ర్ నమాజ్‌ను తరావీహ్ ముగిసిన తరువాత జమాఅత్‌తో పాటు సామూహికంగా చేస్తారు.

(ఆ) ఈ సామూహిక విత్ర్ నమాజ్‌లో ఇమామ్ మూడు రకాతుల్లోనూ సూరాని బిగ్గరగా పఠిస్తారు.

(ఇ) కునూత్ దుఆ కంఠస్థం అయ్యే వరకు ఈ దుఆను పఠించి నమాజ్ చేసుకోవచ్చు, అయితే కునూత్ దుఆను తొందరగా నేర్చుకోవాలి.

వైభవోపేత, పరమాదరణీయ ప్రభువా!

19. ఫర్జ్, సున్నత్, నఫిల్, వాజిబ్, విత్ర్, జుమా, ఈదైన్ – అన్ని నమాజులు పైన వివరించిన తీరులోనే చెయ్యాలి.

# 6

# విత్ర్, తహజ్జుద్ మరియు తరావీహ్ నమాజ్

1. ప్రతిరాత్రి ఇషా నమాజ్ తరువాత మూడు రకాతుల విత్ర్ నమాజ్ చెయ్యడం అవసరం. దీన్ని ముందు చెప్పినట్లు వ్యక్తిగతంగానే చెయ్యాలి. రమజాన్‌లో మాత్రం తరావీహ్ తరువాత జమాఅత్‌తో చేస్తారు.

మొదటి రెండు రకాతులు మామూలుగానే చెయ్యాలి. రెండవ రకఅత్‌లో తషహ్హుద్ పఠించిన తరువాత మూడవరకాతు కొరకు లేచి నిలబడాలి. ఫాతిహా సూరా ఆ తరువాత మరేదయినా సూరా మామూలుగా పఠించి రుకూలోకి పొయ్యే ముందు 'అల్లాహు అక్బర్' అంటూ రెండు చేతులు చెవుల వరకు ఎత్తి తిరిగి మామూలుగా కట్టుకోవాలి. అప్పుడు కునూత్ దుఆ పఠించాలి.

اَللّٰهُمَّ اِنَّا نَسْتَعِيْنُكَ وَنَسْتَغْفِرُكَ وَنُؤْمِنُ بِكَ وَنَتَوَكَّلُ
عَلَيْكَ وَنُثْنِيْ عَلَيْكَ الْخَيْرَ وَنَشْكُرُكَ وَلَا نَكْفُرُكَ
وَنَخْلَعُ وَنَتْرُكُ مَنْ يَّفْجُرُكَ اَللّٰهُمَّ اِيَّاكَ نَعْبُدُ وَلَكَ
نُصَلِّيْ وَنَسْجُدُ وَاِلَيْكَ نَسْعٰى وَنَحْفِدُ وَنَرْجُوْ رَحْمَتَكَ
وَنَخْشٰى عَذَابَكَ اِنَّ عَذَابَكَ الْجِدَّ بِالْكُفَّارِ مُلْحِقٌ ۝

# 7

# జుమ్గా నమాజ్

శుక్రవారంనాడు చెయ్యబడే జుమా నమాజ్, సాధారణంగా చేసే జుహర్ నమాజ్ స్థానంలో చెయ్యబడుతుంది. ఇది ఫర్జ్ (విధి) అయిన నమాజ్. ఇందులో వారానికి ఒకసారి శుక్రవారం నాడు ప్రజలకు ఇస్లామ్ బోధనలు సామూహికంగా వినిపించేందుకు, ప్రజల సరయిన శిక్షణకు వీలు కల్పించడం జరిగింది. దీనికి రెండు అజాన్‌లు ప్రకటించబడతాయి. ఒకటి సూర్యుడు నడి నెత్తినుండి పడమటికి ఒరిగిన తరువాత ప్రారంభంలోనూ రెండవది జనులందరూ సమావేశమయిన తరువాత ఖుత్బా (ప్రసంగం) కు పూర్వం. మొదటి అజాన్‌కు ప్రజలంతా సమావేశమయిన తరువాత ఇమామ్ మింబర్ (వేదిక) నెక్కి కూర్చుంటాడు అప్పుడు ముఅజ్జిన్ రెండవ ఆజాన్ పలుకుతాడు. అప్పుడు ఇమామ్ ఖుత్బా (ప్రసంగాన్ని) ప్రారంభించడానికి మింబర్(వేదిక) పై నిలబడి దైవస్తోత్రం చేసిన తరువాత ఖుర్‌ఆన్ హదీసుల బోధనల్ని వినిపిస్తాడు. వాటిని బోధపరిచేందుకు అర్థాన్ని చెబుతాడు, వివరణలిస్తాడు. ఇలా తొలి ఖుత్బా ముగించి కొంతసేపు మింబర్‌పై కూర్చుని విశ్రాంతి తీసుకుంటాడు. ఆ తరువాత తిరిగి మింబర్‌పై నిలబడి రెండవ ఖుత్బాను (ప్రసంగాన్ని) చేస్తాడు. ఖుత్బాలో ముస్లిముల శ్రేయ సంక్షేమాలకు సంబంధించిన, వృద్ధి వికాసాలకు సంబంధించిన ఏ విషయ మయినా చెప్పవచ్చు. సామాజిక సంస్కరణ, విద్య, ఆర్థిక విషయాల మార్గ దర్శకత్వం, కుటుంబ, వ్యక్తిగత, నైతిక ఆధ్యాత్మిక సమస్యల పరిష్కారం, సాంఘిక, రాజకీయ విషయాల ప్రస్తావన ఏదయినా ఈ ఖుత్బాల్లో ప్రస్తావించడానికి వీలుంది. అయితే అన్ని విషయాలూ దివ్యఖుర్‌ఆన్,

رَبَّنَا اٰتِنَا فِی الدُّنْیَا حَسَنَةً وَّفِی الْاٰخِرَةِ حَسَنَةً وَّقِنَا عَذَابَ النَّارِ

*రబ్బనా ఆతినా ఫిద్దునియా హసనతఁ వ్వ ఫిల్ ఆఖిరతి హసనతఁ వ్వ కినా అజాబన్నార్*

ఓ ప్రభూ ! ఇహలోకపు మంచినీ మాకు ప్రసాదించు, పరలోకపు మంచినీ మాకు ప్రసాదించు; మమ్మల్ని నరకాగ్ని శిక్షనుండి రక్షించు.

**2. తహజ్జుద్ నమాజ్ :** తహజ్జుద్ నమాజ్‌ను అర్ధరాత్రి తరువాత ఉషోదయానికి పూర్వం చేస్తారు. ఇది రెండేసి రకాతులుగా 8 రకాతుల నమాజ్ చెయ్యడం సున్నత్. తహజ్జుద్ నమాజ్ చేసేవారు ఇషాలో విత్ర్ నమాజ్ చెయ్యకుండా తహజ్జుద్ తరువాత చెయ్యడం ఉత్తమం. మహనీయ ముహమ్మద్ తహజ్జుద్ ప్రాముఖ్యతను ఎంతో నొక్కి చెప్పారు. ఇదే నమాజ్ రమజాన్‌లో తరావీహ్ నమాజ్‌లో అంతర్భాగమయిపోతుంది.

**3. తరావీహ్ నమాజ్ :** ఇది సున్నతె ముఅక్కిద (తాకీదు చెయ్యబడిన సున్నత్) అనబడుతుంది. దీన్ని రమజాన్ నెలలో ఇషా తరువాత రెండేసి రకాతులుగా 20 రకాతులు చెయ్యడం జరుగుతుంది. ప్రతి నాలుగు రకాతుల తరువాత కొంత విశ్రాంతి తీసుకోవడం చేతనే దీన్ని 'తరావీహ్' నమాజ్ అని అంటారు. సాధారణంగా తరావీహ్ నమాజ్ చేయించే ఇమాములు హాఫిజ్‌లు (దివ్యఖుర్‌ఆన్ స్మర్తలు) గా ఉంటారు. వారు దివ్యఖుర్‌ఆన్‌ని క్రమంగా 27 రోజుల్లో పూర్తి చేస్తారు. ఏ కారణాలవల్లనయినా సామూహికంగా (జమాఅత్‌తో) తరావీహ్ నమాజ్ చెయ్యడం సాధ్యపడకపోతే దాన్ని వ్యక్తిగతంగా కూడా చేసుకోవచ్చు. తరావీహ్ తరువాత 3 రకాతుల విత్ర్ కూడా జమాఅత్‌తో చెయ్యడం పరిపాటి.

నెరవేర్చడం అవసరం. ఫర్జ్ మరియు వాజిబ్ నమాజ్‌లకు మాత్రమే కజా వర్తిస్తుంది. తప్పిపోయిన నమాజుల క్రమాన్ని కజా నిర్వర్తించేటప్పుడు పాటించడం మంచిది.

కజా నమాజ్ చేసేవారు తమ నియ్యత్‌లో ఇది ఫలానా సమయానికి చెందిన ఫర్జ్ నమాజ్‌కు కజా అని నియ్యత్ చేసుకోవాలి.

ఎవరయినా వ్యాధిగ్రస్తులయితే మస్జిద్‌కు వెళ్ళి లేక నిలబడి నమాజ్ చెయ్యలేకపోతే కూర్చుని లేక పరుండే అయిదువేళల నమాజ్‌ను ఆచరించాలి. రుకూ సజ్దాలను సంకేతాలతోనయినా వీలయినంత వరకు ఆచరించడం మంచిది.

# 9

# కస్ర్ నమాజ్

48 మైళ్ళు లేక దానికంటే అధిక దూరం ప్రయాణం చేసే వారికి షరీఅత్‌లో ఓ మినహాయింపు ఉంది. వారు 4 రకాతుల ఫర్జ్ నమాజును రెండు రకాతులుగానే చెయ్యాలి. దాన్ని షరీఅత్‌లో కస్ర్ నమాజ్ అనంటారు. అయితే ప్రయాణంచేసి గమ్యస్థానంలో 15 రోజులు లేక దానికి అధికకాలం బసచేసే సంకల్పం ఉంటే అప్పుడు కస్ర్ చెయ్యరాదు. పూర్తి నమాజ్ చెయ్యాలి. ఫజ్ర్ మరియు మగ్రిబ్ నమాజులకు కస్ర్ లేదు. ఇమామ్ కస్ర్ చెయ్యనివాడయి( ఆ ఊరి వ్యక్తి) ఉండి, ముక్తదీలు ప్రయాణీకులయి ఉంటే ప్రయాణీకులు ఇమామ్ అనుసరణలో పూర్తి నమాజ్ చెయ్యాలి. ఇమామ్ ప్రయాణీకుడయి ముక్తదీలు కస్ర్ చేయని వారయి( ఆ ఊరి వారు) ఉంటే

హదీసులు, మహాప్రవక్త (సఅసం) బోధనలు, ఆదర్శాలకు అనుగుణంగానే ఉండాలి.

ఈ విధంగా రెండవ ఖుత్బా ముగియగానే ఇమామ్ మింబర్ దిగి నమాజ్ చేయించే ముసల్లా మీదికి వస్తాడు. ముఅజ్జిన్ ఇకామత్ చెప్పగానే ఇమామ్ రెండు రకాతుల జుమా ఫర్జ్ నమాజ్ చేయిస్తాడు. ఫర్జ్ తరువాత జనులు వ్యక్తిగతంగా సున్నత్ నమాజులు చేసుకుంటారు. జుమా నమాజ్ చేసిన వారు జుహర్ నమాజ్ చెయ్యనవసరం లేదు. ఎవరయినా ఏ కారణాల వల్లనయినా జుమా నమాజ్‌లో పాల్గొనలేకపోతే వారు మామూలుగా జుహర్ నమాజ్ చేసుకోవాలి.

గమనిక : (అ) జుమా కోసం చెయ్యబడే తొలి అజాన్‌కు తరువాత నమాజ్ ముగించి బయటికి వచ్చే వరకు వ్యాపారం, ఇతరత్రా లావాదేవీలు నిషిద్ధం.

(ఆ) జుమా నమాజ్ తరువాత తమ వ్యవహారాల్లోకి వెళ్ళి బ్రతుకు తెరువుకోసం కృషి చెయ్యడం, దైవానుగ్రహాన్ని అన్వేషించడం ఉత్తమం.

(ఇ) ఎవరయినా ఆలస్యంగా వచ్చి జుమా నమాజ్‌లో చేరినట్లయితే ఇమామ్ సలామ్ పలికిన తరువాత లేచి తప్పిపోయిన రకాత్ లేక రకాతుల్ని పూర్తి చేసుకోవచ్చు.

# 8

# కజా నమాజ్

తప్పిపోయిన నమాజ్‌ను పూర్తి చేసుకోవడాన్ని కజా నమాజ్ అనంటారు. ఫర్జ్ నమాజ్ అనివార్యమయింది గనుక ఎవరయినా ఏ నమాజ్ అయినా ఏ కారణం వల్లనయినా చెయ్యలేకపోతే దాని 'కజా' అయినంత తొందరలో

వస్తుంది. మరపువల్ల కాక కావాలని ఏదయినా ఫర్జ్ లేక వాజిబ్ వదిలేస్తే నమాజ్ తిరిగి చెయ్యవలసి ఉంటుంది. సహూ సజ్దా వల్ల ప్రయోజనం లేదు.

రెండు రకాతుల నమాజ్ అయినా లేక మూడు, నాలుగు రకాతుల నమాజ్ అయినా సహూ సజ్దా చెయ్యడం అవసరమయితే చివరి కఅదాలో అత్తహయ్యాత్ పఠించిన తరువాత కుడివైపునకు మరలి సలామ్ చెప్పి రెండు సజ్దాలు మామూలుగా చెయ్యాలి. ఆ తరువాత అత్తహయ్యాత్, దరూదె ఇబ్రాహిమి, దుఆ పఠించి సలామ్ పలికి నమాజ్ మామూలుగా ముగించాలి.

# 11

## జనాజా నమాజ్

1. ఒక ముస్లిమ్ మరణించినప్పుడు మృత కళేబరానికి స్నానం చేయించడం జరుగుతుంది. ఈ స్నానంలో తొలుత వుజూలో శుభ్రపరిచే అవయవాలను ఆ తరువాత మొత్తం శరీరాన్ని శుభ్రపరచడం జరుగుతుంది. ఆ తరువాత మూడు బట్టల్లో (కఫన్‌లో) దాన్ని చుట్టి (స్త్రీలకు 5 బట్టలు) షహీదులకు (అమరగతులకు), అన్యాయంగా చంపబడిన నిరపరాధులకు, ప్రమాదాలలో చనిపోయిన వారికి వీలునుబట్టి గుసుల్, కఫన్‌లు లేకుండానే వారి వంటిపై బట్టల్లోనే ఖననం చెయ్యడం జరుగుతుంది.

గమనిక : స్త్రీల మృత దేహాన్ని స్త్రీలే గుసుల్ కఫన్ చేయించాలి.

2. గుసుల్, కఫన్ ముగిసిన తరువాత మృతదేహాన్ని జనాజా (శవపేటిక)లో పెట్టి ఆరుబయట వుంచి జనాజా నమాజ్ చేస్తారు. ఆ తరువాత జనాజాను

ఇమామ్ కస్ర్ చేస్తాడు. ఇమామ్ సలామ్ పలికి నమాజ్ ముగించగానే ముక్తదీలు సలామ్ పలకకుండా లేచి నిలబడాలి. మిగతా రెండు రకాతులు పూర్తిచేసుకోవాలి. ఈ రెండు రకాతుల్లో కేవలం ఫాతిహా సూరా మాత్రమే పఠించి ఇతర సూరా పఠించకుండా రుకూ, సజ్దాలు మామూలుగా చేసుకుని నమాజ్ పూర్తి చేసుకోవాలి.

ప్రయాణంలో ఎవరికయినా నమాజ్ కజా అయినట్లయితే అతను తిరిగి ఇంటికి చేరిన తరువాత దాన్ని పూర్తి చెయ్యదలచుకుంటే కస్ర్ నమాజ్‌నే చెయ్యాలి. అలాగే ఎవరయినా ప్రయాణానికి పూర్వం ఏ నమాజ్ అయినా కజా చేసుకుంటే, ప్రయాణంలో దాన్ని పూర్తి చేయదలచినా ఆ నమాజ్ పూర్తిగా చెయ్యవలసిందే. కస్ర్ చెయ్యడానికి వీల్లేదు. ఎవరయినా నిర్ణీత కాలం దృష్టిలో లేకుండా ప్ర[illegible]ాణంచేసి పని పూర్తవగానే మరలాలనుకుంటే అప్పుడు కస్ర్ నమాజ్ చెయ్యడమే ఉత్తమం. ఆ విధంగా ముందే నిర్ణయం లేకుండా ప్రయాణావస్థలో అతను 15 రోజులకు అధికంగా గడిపినా నమాజ్ కస్ర్ చెయ్యాలి.

# 10

# సహూ సజ్దా

ఎవరయినా నమాజ్‌లో ఏదయినా తప్పుచేస్తే, లేక చేసిన రకాతుల సంఖ్య మరచిపోతే, ఏదయినా వాజిబ్‌ని మరచిపోతే, లేక ఏదయినా వాజిబ్ లేక ఫర్జ్ తారుమారయితే సహూ సజ్దా చెయ్యవలసి ఉంటుంది. అది చేస్తే నమాజ్ సరవుతుంది; చెయ్యకపోతే నమాజ్ తిరిగి మొదటి నుండి చెయ్యవలసి

اَللّٰهُمَّ اغْفِرْ لِحَيِّنَا وَمَيِّتِنَا وَشَاهِدِنَا وَغَائِبِنَا وَصَغِيْرِنَا وَكَبِيْرِنَا وَذَكَرِنَا وَاُنْثَانَا اَللّٰهُمَّ مَنْ اَحْيَيْتَهُ مِنَّا فَاَحْيِهِ عَلَى الْاِسْلَامِ وَمَنْ تَوَفَّيْتَهُ مِنَّا فَتَوَفَّهُ عَلَى الْاِيْمَانِ

అల్లాహుమ్మగ్‌ఫిర్ లిహయ్యినా వ మయ్యితినా వ షాహిదినా వ గాయిబినా వసగీరినా వ కబీరినా వ జకరినా వ ఉన్సానా. అల్లాహుమ్మ మన్ అహ్‌యయ్‌తహు మిన్నా ఫ అహ్‌యిహి అలల్ ఇస్లామ్. వమన్ తవఫ్ఫయ్‌తహు మిన్నా ఫతవఫ్ఫహు అలల్ ఈమాన్.

అల్లాహ్ ! క్షమాభిక్షప్రసాదించు – మాలోని బ్రతికున్న వారికి, మాలోని చనిపోయినవారికి, మాలోని హాజరున్న వారికి, ప్రస్తుతం ఇక్కడ లేని వారికి, మాలోని చిన్నలకు, మాలోని పెద్దలకు, మా పురుషులకు, మా స్త్రీలకు. ఓ అల్లాహ్! మాలో ఎవరినయితే సజీవంగా ఉంచుతావో వారిని ఇస్లామ్ ( నీ విధేయతా మార్గం) పై సజీవులుగా ఉంచు. మాలో ఎవరికయితే చావునిస్తావో వారికి ఈమాన్ (నీ విశ్వాసం) పై మరణాన్నివ్వు.

3. చనిపోయిన వ్యక్తి మగపిల్లవాడు అయితే పై దుఆ తరువాత ఈ దుఆ కూడా పఠించాలి.

اَللّٰهُمَّ اجْعَلْهُ لَنَا فَرَطًا وَاجْعَلْهُ لَنَا اَجْرًا وَّذُخْرًا وَّاجْعَلْهُ لَنَا شَافِعًا وَّمُشَفَّعًا

అల్లాహుమ్మజ్ అల్‌హులనా ఫరతన్ వజ్ అల్‌హులనా అజ్‌రన్ వ జుఖ్‌రన్ వజ్ అల్‌హులనా షాఫిఅతన్ వ ముషఫ్ఫఅతన్.

ఓ అల్లాహ్ ! నీవు ఇతన్ని మా మోక్షం కొరకు ముందుగా పంపిన వానిగా చెయ్యి. ఇతని వియోగం వల్ల కలిగే బాధను మా కొరకు ప్రతిఫలంగా, [illegible], పుణ్య

సమాధి వరకు భుజాలపై మోసుకు వెళ్ళడం జరుగుతుంది. జనాజా నమాజ్ ఫర్జె కిఫాయాగా పరిగణించబడుతుంది. అంటే దీన్ని ఆచరించకపోతే ఆ ప్రాంతం ప్రజలందరిపై ఆ విధి నిర్వర్తించని బాధ్యత తారసిల్లుతుంది. అయితే ఆ ప్రాంతంలో ఏ కొందరు ఆచరించినా ఆ బాధ్యత అందరి పై నుండి తొలిగిపోతుంది.

జనాజా నమాజ్ ప్రకటన "సలాతుల్ జనాజా" అని చెయ్యబడుతుంది. దీనికి అజాన్, ఇకామత్ ఉండవు. ఇందులో 3 అధిక తక్బీరులుంటాయి. రుకూ, సజ్దాలు ఉండవు.

**3. జనాజా నమాజ్ చేసే విధానం :** జనాజాను, తల ఉత్తర దిశన, పాదాలు దక్షిణాన ఉన్నట్లు ఉంచడం జరుగుతుంది. ఇమామ్ జనాజాకు తూర్పున దాని రొమ్ము భాగానికి ఎదురుగా కిబ్లా వైపునకు తిరిగి నిలబడతాడు. ముక్తదీలు అతనికి వెనకాల మూడు లేక అంతకంటే ఎక్కువ వరసల్లో (వీలయినంతవరకు బేసి సంఖ్యలో) బారులు తీరి నిలుచుంటారు.

నియ్యత్ ఏ భాషలోనయినా చెయ్యవచ్చు........

నేను అల్లాహ్ కొరకు నమాజ్ చేస్తున్నాను – ఈ శవం కొరకు (మన్నింపునకై) దుఆ చేస్తూ ఈ ఇమామ్ అనుసరణలో...

1. నియ్యత్ తరువాత రెండు చేతులూ సాధారణంగా నమాజ్‌లో మాదిరిగానే చెవుల వరకు ఎత్తి అల్లాహు అక్బర్ అంటూ బొడ్డుపై కట్టుకోవాలి. అప్పుడు 'సనా' పఠించాలి. తరువాత చేతులెత్తకుండానే అల్లాహు అక్బర్ అని పలికి దరూదె ఇబ్రాహీమి పఠించాలి.

2 మూడవసారి అల్లాహు అక్బర్ (చేతులెత్తకుండానే) అని జనాజా నమాజ్ దుఆ పఠించాలి.

ధార్మిక స్థితి నిర్ధారితంగా తెలిసిందే. రెంటిలోనూ రెండేసి రకాతుల నమాజ్ ఆ తరువాత ఖుత్బా ప్రసంగం జరుగుతుంది. ఈ పండుగలనే ఈదైన్ అని అంటారు. అంటే మాటి మాటికి వచ్చేతిరునాళ్ళు (సంతోష దినాలు) అని అర్థం. మొదటి పండుగకు ఈదుల్ ఫిత్ర్ అని పేరు. ఇది రమజాన్ నెల మొత్తం (29 లేక 30 రోజులు) ఉపవాస వ్రతం పాటించిన తరువాత షవ్వాల్ నెల మొదటి తేదికి వస్తుంది. రెండవ పండుగ పేరు ఈదుల్ అజ్హా. ఇది జిల్‌హజ్జా మాసం 10వ తారీఖున జరుపుకుంటారు. హజ్రత్ ఇబ్రాహీం (అలైహిస్సలాం) దైవాజ్ఞ ప్రకారం తన తనయుడు హజ్రత్ ఇస్మాయీల్ (అస్సలాం)ను సంతోషంగా త్యాగం చెయ్యడానికి అంగీకరించారు. ఆ సందర్భానికి జ్ఞాపకార్థంగా ఈ పండుగ జరుపుకుంటారు. ఈ దైవాజ్ఞ కేవలం హజ్రత్ ఇబ్రాహీం విశ్వాస పరీక్షకుగాను వచ్చింది మాత్రమే.

2. (అ) ఈదుల్ ఫిత్ర్ : రమజాన్ నెలలో పూర్తి నెల ఉపవాస వ్రతాలు పాటించడం ముస్లిములందరికీ విధిగా నిర్ణయించబడింది. రోజా అంటే సూర్యోదయానికి షుమారు గంటన్నర పూర్వం మొదలుకుని సూర్యాస్తమయం వరకు అన్న పానీయాలు ఇంకా వారించబడిన ఇతర చర్యలకు దూరంగా ఉండటాన్ని అంటారు. రోజా వ్రతాలు పూర్తయిన తరువాత షవ్వాల్ మొదటి తేదికి ఈదుల్ ఫిత్ర్ జరుపుకుంటారు. ఆ రోజు ఆనందాతిశయంతో దేవుని గొప్పతనాన్ని, స్తోత్రగానాన్ని చాటడం జరుగుతుంది.

اَللّٰهُ اَكْبَرُ ط اَللّٰهُ اَكْبَرُ ط لَآ اِلٰهَ اِلَّا اللّٰهُ

وَاللّٰهُ اَكْبَرُ ط اَللّٰهُ اَكْبَرُ ط وَلِلّٰهِ الْحَمْدُ ط

అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ లా ఇలాహ ఇల్లల్లాహు అల్లాహు అక్బర్, అల్లాహు అక్బర్ వ లిల్లా హిల్ హమ్ద్.

నిధిగాను చెయ్యి. ఇతన్ని మా కొరకు సిఫారసు చేసేవానిగా చెయ్యి – అతని సిఫారసు అంగీకరించబడేలా చెయ్యి.

4. చనిపోయినది బాలిక అయితే

اَللّٰهُمَّ اجْعَلْهَا لَنَا فَرَطًا وَّاجْعَلْهَا لَنَا اَجْرًا وَّذُخْرًا وَّاجْعَلْهَا لَنَا شَافِعَةً وَّمُشَفَّعَةً ۝

అల్లాహుమ్మజ్ అల్హాలనా ఫరతన్ వజ్ అల్హాలనా అజ్రన్ వ జుఖ్రన్ వజ్అల్హా లనా షాఫిఅతన్ వ ముషప్ఫఅతన్.

ఓ అల్లాహ్! ఈ అమ్మాయిని మా మోక్షం కొరకు అగ్రగామిగా చెయ్యి. ఈమె వియోగ బాధను మా కొరకు పుణ్యప్రదంగాను పుణ్య నిధిగాను చెయ్యి. ఈ అమ్మాయిని మా కొరకు, అంగీకరించబడే సిఫారసు చేసే దానిలా చెయ్యి.

5. నాల్గవసారి చేతులెత్తకుండా అల్లాహు అక్బర్ అని కుడి ఎడమ ప్రక్కలకు తిరిగి మాములుగానే సలామ్ చెప్పాలి. ఇక జనాజా నమాజ్ పూర్తయినట్లే.

ఇమామ్ తక్బీర్లు సలామ్ బిగ్గరగా చెబుతాడు. ముక్తదీలు మెల్లగా చెప్పాలి. అయితే మిగతా దుఆలు అందరూ మెల్లిగానే పఠించాలి.

ఆ తరువాత జనాజాను సమాధి వద్దకు తీసుకువెళ్ళి శవాన్ని ఖననం చెయ్యాలి.

# 12

# ఈద్ (పండుగ) నమాజులు

1. ముస్లిముల కొరకు సంవత్సరానికి రెండు పండుగలున్నాయి. వీటి

మాదిరిగానే రెండు ఖుత్బాలు ముగించి ఇమామ్ మింబర్ దిగి క్రింద కూర్చుని దుఆ చేస్తాడు. ఈ విధంగా ఈద్ నమాజ్ ముగిసిపోతుంది.

ఈదుల్ ఫిత్ర్ నమాజ్‌కు వెళ్ళేముందు ఫిత్రా దానం చెల్లించి పోవడం ముఖ్యం. ఒక్కొక్క వ్యక్తికి దాదాపు ఒక కిలో 750 గ్రాముల గోధుమలు లేక దానికి సమానమయిన ధర ఫిత్రాగా చెల్లించవలసి ఉంటుంది.

2. (ఆ) ఈదుల్ అజ్‌హా నమాజ్ మరియు ఖుత్బాలు కూడా ఈదుల్ ఫిత్ర్ మాదిరిగానే నెరవేర్చడం జరుగుతుంది. ఈదుల్ అజ్‌హా నమాజ్ తరువాత కలిగినవారు కుర్బానీ చెయ్యడం విధి. దాని మాంసాన్ని మూడు భాగాలుగా విభజించి ఒకటి తన కుటుంబం కొరకు, మరొకటి బంధుమిత్రుల కొరకు, ఇంకొకటి బీదసాదలకు పంచి పెట్టడం ఉత్తమ పద్ధతి.

# 13

# మహిళల నమాజ్ విధానం

స్త్రీలు కూడా పురుషుల మాదిరిగానే నమాజ్ చెయ్యాలి. అయితే కొన్ని అంశాల వ్యత్యాసం మాత్రం ఉంది.

1. స్త్రీలు నమాజ్‌కు పూర్వం ముఖం , రెండు చేతులు మునిజేతుల వరకు, రెండు పాదాలుతప్ప శరీరం మొత్తాన్ని బురకాతోనో, దుప్పటితోనో లేక దుస్తులతోనో పూర్తిగా కప్పుకోవాలి.

2. తొలి తక్బీర్ చెప్పేటప్పుడు చేతులు దుప్పటి లోపలి నుంచే భుజాల వరకు ఎత్తాలి.

3. చేతులు రొమ్ముపై కట్టుకోవాలి. ఎడమ ముంజేతిపై కుడి ముంజెయ్యి ఉన్నట్లు కట్టుకోవాలి.

నిస్సందేహంగా మేము మీకు కౌసర్ నిచ్చాము

فَصَلِّ لِرَبِّكَ وَانْحَرْ ۝

ఫ సల్లి లిరబ్బిక వన్హర్

ఇక మీరు మీ ప్రభువు కొరకు నమాజ్ చెయ్యండి కుర్బానీ చెయ్యండి.

إِنَّ شَانِئَكَ هُوَ الْأَبْتَرُ ۝

ఇన్న షా 'నియక హువల్ అబ్తర్

నిస్సందేహంగా మీ చెడును కోరే వాడే తన తరువాత ఏ ఆశా, ఏ ఆధారం లేని వాడు.

## 2. అల్–కాఫిరూన్

بِسْمِ اللهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

قُلْ يٰٓاَيُّهَا الْكٰفِرُوْنَ ۝

కుల్ యా అయ్యుహల్ కాఫిరూన్

(ఓ ప్రవక్తా) చెప్పివెయ్యండి, "ఓ తిరస్కారులారా!

لَآ اَعْبُدُ مَا تَعْبُدُوْنَ ۝

లా ఆ'బుదు మా తా'బుదూన్

"మీరు వేటినయితే ఆరాధిస్తారో నేను వాటిని ఆరాధించను.

4. రుకూలో స్త్రీలు తమ మునివ్రేళ్ళు మోకాళ్ళకు తాకేంత వంగినా చాలును. వ్రేళ్ళన్నీ ఒక్కటిగా చేర్చి మోచేతులు ప్రక్కలకు అంటిపెట్టుకుని, చీలమండలాలు ఒకదానికొకటి అంటిపెట్టుకుని ఉండాలి.

5. సజ్దాలో పాదాలు నిలువుగా కాక కుడి ప్రక్కకు అడ్డంగా ఉంచాలి. చేతులు ప్రక్కలకు, కడుపు, తొడలకు కలిసిపోయేలా ఉంచాలి.

6. కఅదాలో రెండు పాదాలు కుడిప్రక్కకు అడ్డంగాపెట్టి ఎడమ ప్రక్కకు ఒరిగి కూర్చోవాలి.

7. నిత్యం సూరాలు పఠించేటప్పుడు మెల్లిగా పఠించాలి. బిగ్గరగా కూడదు.

గమనిక : 1. ఋతుస్రావం జరిగేటప్పుడు, బాలింతగా ఉన్నప్పుడు స్త్రీలు ఎలాంటి నమాజ్ కూడా చెయ్యరాదు. ఎలాంటి రోజాలూ పాటించరాదు. 2. ఆ రోజుల నమాజ్‌లు కజా చెయ్యనవసరం లేదు. అవి పూర్తిగా మాఫీ చెయ్యబడ్డాయి. 3. అయితే ఆ కాలంలో రమజాన్ నెల వచ్చి రోజాలు తప్పిపొయ్యి ఉంటే అవి తరువాతి దినాల్లో కజాగా పూర్తి చెయ్యవలసి ఉంటుంది.

కొన్ని సూరాలు, వాటి భావార్థం దిగువన ఇస్తున్నాము. ఫాతిహా సూరా 'నమాజ్ భాగంలో ఇవ్వడం జరిగింది.

## 1. అల్ – కౌసర్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ۝

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అనంతకరుణామయుడు అపారకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

اِنَّآ اَعْطَيْنٰكَ الْكَوْثَرَ ۝

ఇన్నా ఆ ' తయినా కల్ కౌసర్

# 3. అన్ –నస్ర్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

اِذَا جَآءَ نَصْرُ اللّٰهِ وَالْفَتْحُ ○

ఇజా జా అ నస్రుల్లాహి వల్‌ఫత్‌హ్

అల్లాహ్ సహాయం, విజయం ఆసన్నమయినప్పుడు

وَرَاَيْتَ النَّاسَ يَدْخُلُوْنَ فِىْ دِيْنِ اللّٰهِ اَفْوَاجًا ○

వ రఅయ్ తన్నాస యద్ ఖులూన ఫీ దీనిల్లాహి అఫ్‌వాజా

ప్రజలు గుంపులు గుంపులుగా దైవ ధర్మంలో ప్రవేశించడాన్ని మీరు చూస్తారు.

فَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ وَاسْتَغْفِرْهُ ؕ اِنَّهٗ كَانَ تَوَّابًا ○ ٤

ఫసబ్బిహ్ బి హమ్దిరబ్బిక వస్తగ్ ఫిర్‌హు ఇన్నహూ కానతవ్వాబా

కనుక మీ ప్రభువు స్తోత్రంతో ఆయన పరిశుద్ధతను కొనియాడండి, ఆయన మన్నింపును వేడుకోండి, నిస్సందేహంగా ఆయన పశ్చాత్తాపాన్ని, ఆయన వైపు మరలడాన్ని ఎంతో అధికంగా గ్రహిస్తాడు.

وَلَآ اَنْتُمْ عٰبِدُوْنَ مَآ اَعْبُدُ ۝

వలా అన్‌తుమ్ ఆబిదూన మా ఆ'బుద్
"మరియు మీరు, నేను ఎవరిని (ఏ ఏకైక దైవాన్ని) ఆరాధిస్తానో
ఆయన్ని ఆరాధించరు.

وَلَآ اَنَا عَابِدٌ مَّا عَبَدْتُّمْ ۝

వలా అన ఆబిదున్మ్మాఅ అబ దత్తుమ్
మరియు నేను కూడా (మీరే సృష్టించుకుని) ఆరాధించే (దైవాలను)
ఆరాధించను.

وَلَآ اَنْتُمْ عٰبِدُوْنَ مَآ اَعْبُدُ ۝

వలా అన్తుమ్ ఆబిదూన మా ఆ'బుద్
మరియు మీరున్నూ (ఆ పరిశుద్ధ స్వామిని) ఎవరినయితే నేను
ఆరాధిస్తానో ఆయన్ని ఆరాధించరు.

لَكُمْ دِيْنُكُمْ وَلِيَ دِيْنِ ۝

లకుమ్ దీనుకుమ్ వ లియ దీన్
మీకు మీ ధర్మం, నాకు నాధర్మం.

# 5. అల్ ఇఖ్లాస్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అపార కృపాశీలుడు పరమదయామయుడు అయిన అల్లాహ్ పేరుతో...

قُلْ هُوَ اللّٰهُ اَحَدٌ ○

కుల్ హు వల్లాహు అహద్

చెప్పండి, ఆయన - అల్లాహ్ - ఒక్కడే

اَللّٰهُ الصَّمَدُ ○

అల్లాహుస్సమద్

అల్లాహ్ పైనే అందరూ ఆధారపడతారు (ఆయన ఎవరిపైనా ఆధారపడడు)

لَمْ يَلِدْ ۙ وَلَمْ يُوْلَدْ ○

లమ్ ఎలిద్ వలమ్ యూలద్

ఆయనకు ఏ సంతానమూ లేదు, ఆయన ఎవరికీ సంతానం కాదు.

وَلَمْ يَكُنْ لَّهٗ كُفُوًا اَحَدٌ ○

వలమ్ ఎకున్ లహు కుఫు అన్ అహద్

ఆయనకు ఎవరూ సమానులు కారు

# 4. అల్ – లహబ్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

تَبَّتْ يَدَآ اَبِىْ لَهَبٍ وَّتَبَّ

తబ్బత్ యదా అబీ లహబిఁ వ్వ తబ్బ్

తెగిపొయ్యాయి అబూలహబ్ రెండు చేతులు, నాశనమయ్యాడతను

مَآ اَغْنٰى عَنْهُ مَالُهٗ وَمَا كَسَبَ

మా అగ్నా అన్హు మాలుహు వమా కసబ్

అతని సిరులు అతని సంపాదన ఏదీ అతనికి ఉపకరించలేదు

سَيَصْلٰى نَارًا ذَاتَ لَهَبٍ

స యస్లా నారన్ జాత లహబ్

అతి త్వరలో అతను జ్వాలాగ్నిలో మండుతాడు -

وَّامْرَاَتُهٗ ؕ حَمَّالَةَ الْحَطَبِ

వ మ్రాఅతుహూ; హమ్మాలతల్ హతబ్

ఎండిన కట్టెల్ని ఇంధనంగా మోసుకువచ్చే అతని భార్య కూడా.

فِىْ جِيْدِهَا حَبْلٌ مِّنْ مَّسَدٍ

ఫీ జీదిహా హబ్లున్ మ్మిమ్మసద్

బాగా పేనిన ఖర్జూరపు నార త్రాడు ఆమె మెడను చుట్టి ఉంటుంది.

وَمِنْ شَرِّ حَاسِدٍ اِذَا حَسَدَ ٥

వ మిన్ షర్రి హాసిదిన్ ఇజా హసద్

ఈర్ష్యపడే వాడి ఈర్ష్యతెచ్చే చెడునుండి

## 7. అన్–నాస్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అపార కృపాశీలుడు పరమ దయామయుడు అయిన అల్లాహ్ పేరుతో.

قُلْ اَعُوْذُ بِرَبِّ النَّاسِ ١

కుల్ అవుజు బి రబ్బిన్నాస్

చెప్పండి, నేను మానవుల పరిపోషకుడు, ప్రభువు

مَلِكِ النَّاسِ ٢

మలికిన్నాస్

మానవుల పరిపాలకుడు

اِلٰهِ النَّاسِ ٣

ఇలా హిన్నాస్

మానవుల ఆరాధ్యుడు అయిన వాని శరణు కోరుతున్నాను -

مِنْ شَرِّ الْوَسْوَاسِ الْخَنَّاسِ ٤

మిన్ షర్రిల్ వస్వాసిల్ ఖన్నాస్

సందేహాలు, సంశయాలు సృజించేవాని చెడు నుండి -

# 6. అల్ – ఫలక్

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ ○

బిస్మిల్లా హిర్రహ్మా నిర్రహీమ్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

قُلْ اَعُوْذُ بِرَبِّ الْفَلَقِ ○

కుల్ అఊజు బిరబ్బిల్ ఫలక్

చెప్పండి (ఓ ప్రవక్తా) నేను ప్రొద్దుపొడుపు కు ప్రభువు అయిన వాని శరణు వేడుకుంటున్నాను -

مِنْ شَرِّ مَا خَلَقَ ○

మిన్ షర్రి మా ఖలక్

ఆయన సృజించిన అన్ని చెడులనుండి

وَمِنْ شَرِّ غَاسِقٍ اِذَا وَقَبَ ○

వ మిన్ షర్రి గాసికిన్ ఇజా వకబ్

అలుముకునే రాత్రి చీకటి నుండి

وَمِنْ شَرِّ النَّفّٰثٰتِ فِى الْعُقَدِ ○

వ మిన్ షర్రిన్ నఫ్ఫాసాతి ఫిల్ ఉకద్

ముడులలో (మంత్రాలు) ఊదే స్త్రీల చెడుల నుండి

الَّذِيْ يُوَسْوِسُ فِيْ صُدُوْرِ النَّاسِ ۝

అల్లజీ యువస్ విసు ఫీసుదూరిన్నాస్

వాడు మాటి మాటికీ కుశంకలు సృజించి వెనిక్కి మరలుతూ ఉంటాడు.

వాడు మానవుల హృదయాల్లో సంశయాలు సృజిస్తూ ఉంటాడు

مِنَ الْجِنَّةِ وَالنَّاسِ ۝

మినల్ జిన్నతి వన్నాస్

వాడు జిన్నులకు చెందిన వాడు కావచ్చు, మానవులకు చెందినవాడూ కావచ్చు.